శ్రీపరబ్రహ్మణేనమః

# పీఠిక.

---

చ. సిరియొక యింత చేకుఱుటచేతనె మత్తిలి ముందు కీడుమే
ల్కొరపెడివాఁ డొకండు గలఁడంచుఁ దలంపక పెక్కుదోసముల్
జరపెడి వారినేన్ దగుదోసంగిడి పిమ్మటఁ బ్రోచువేల్పు దా
సరగున నేలుఁగాత గురుసామిని వేంకట సుబ్బ రాయనిన్.

సీ. ఏవాఁడు జగముల నెల్లను నొక్కటఁ దలఁపులోననె తాను గలుగఁ జేయు
నెవ్వాఁడుకనఁబడ కల్లచోటులనుండి యన్నింటినయంబు నరసిప్రోచు
నెవ్వాని యిచ్చమై నెల్లమైతాల్పులు దివికినేగుదురు బొందిగముఁ బాసి
యెవ్వఁడు నెటఁదప్ప కెపుడునుండెడివారికెన్నఁడుఁ దఱుఁగనియెలమిఁ గూర్చు
నట్టివేలుపువాఁడొన నలవిగాని కనికరంబున నెనలేని కలిమి యొసఁగి
రమణఁ గొల్ల వేంకట సుబ్బరాయసెట్టి నతనితమ్ముని గురుసామినరయు గాత.

క. బటువు జగమ్ములఁ గలయ, న్నిటికిని దొరయైన యట్టి నెఱవేలుపు వేం
కటసుబ్బ రాయసెట్టిని, దిటవుగ గురుసామిసెట్టిఁ దిరముగ మనుచున్.

సీ. ఏవారియింటి పేరిజ్జగంబునఁ దొల్లి గుఱ్ఱము వారని కుదిరియుండి
కొల్లగా రోయావిఁగోరు వారలఁదన్ప గడను గొల్లావారుగాఁగ మాటె
నెవ్వరి కొలమునకెల్ల సింగనసెట్టి మొదటివాఁడయి పేరు మోచియుండె
నెవ్వారి తాత పేరెన్నికకును నెక్కు సుబ్బరాయలుసెట్టి సొబగుమీఱె
మిపుల సరివారిలోన గారవముఁగాంచి, యొసఁగినట్టి వేంకయసెట్టి యెవరితండ్రి
యట్టివేంకట సుబ్బరాయలునుదమ్ముఁ, డై నగురుసామిసెట్టియునలరుచుండ్రు.

చ. అడవిమెగంబు లందమగునట్టి పులుంగులు నున్నతోఁటయె
క్కుడఁ గనువారివేడ్కకయి కన్నులపండువు గాఁగనుండునే
కడఁ బటువింతలెల్లఁ జనికాంచెడివారికిఁ గాఁగఁ గూరుపం
బడిన పెదందసాల చెలువంబగుఁ జూపఱకన్ను విందుగాఁ.

ఉ. ఎక్కడఁ గూడి నాయములనేపురు తీర్చెదుగొప్పకొల్వు వే
ఱెక్కడనీడులేక తగు నెక్కడఁ బిల్లలకన్ని విద్దెలం
జక్కఁగ నేర్పి తేఱుపఁగఁ జాలిన విద్దెలసాలయొప్పుఁ దా
నెక్కడ గొప్పకోట యొకఁడింపగు దండులు నిండియుండఁగన్.

సీ. ఏవీటితూర్పున నెసఁగును సంద్రంబు డాయరాని యగడ్తయో యనంగ
నేప్రోలినుండి తామింతలోఁ బొగబండు లెల్లెడలకు నిచ్చ లేగివచ్చు
నేనేలఁ బొగయోడ లింపుకలో దీవి వారినైనను గొనివచ్చినిలుచు
నెచ్చోట నాణెము లచ్చొత్తుచుండెడు జానుమీఱెడు టంకసాలయుండె
రాణిగారికి మాఱుగా రాచఱికము, వెలయఁ జెల్లించు దొర తనకొలువువారి
తోడనెచ్చట నెప్పుడుఁ గూడియుండు, నట్టి చెన్నపట్టణమున కలరువేడ్క.
సీ. ఏనొకపనిమీఁద నేగియున్నపుడు నాకూరిమి నెయ్యుఁడౌ కారుమంచి
సుబ్బరాయలు నాయఁ డబ్బురమగు వాని నెల్లనా కావీట నెలమిమీఱఁ
జూపుచు నొకనాఁడు సుబ్బరాయలుసెట్టి గారియింటికి నన్ను గారవమునఁ
గొనిపోవదవ్వుగ గురుసామి సెట్టియు నన్నయు నెదురుగా నరుగుదెంచి
మేడమీఁదికిఁ గూరిమి మీఱనన్నుఁ, నెలమిఁ గొనిపోయితమ్ములమ్ములనొసంగి
కరముమరియాదయొనరించిసరసనొక్క, కుర్చిమీఁదఁగూర్చుండనొనర్చియవల
తే. సేమమారసి మఱికొంతసేపు వేడ్క
ముచ్చటలతోడ నచ్చటఁ బ్రొద్దుపుచ్చి
మాటవెంబడిపాండుకొమాళ్ళకతను
గొలఁదిగాఁదెనుఁగునఁ జేయఁగోరుటయు.
క. కొల్లావారలు పెల్లుగ, నెల్లెడలను బేరువడుట నెన్నెన్నియొ బా
వళ్ళను బలుసత్తరువులఁ, గొల్లగ నిలుపుటయు నెంచి కొంకని మదితోన్.
తే. నేను నీకొని యిమ్మడిక్క దీని వ్రాయఁ
బూనినాఁడను దెలుఁగునఁ బొలుపుమీఱ
వారికెప్పుడు మేలునుగోరునట్టి
కందుకూరి వీరేశలింగమనువాఁడ.

# శుద్ధాంధ్రభారతసంగ్రహము.

(అచ్చతెనుఁగు భారతము)

---

## ప్రథమాశ్వాసము

చ. సిరులను గూర్మితో నొసఁగి సేగి యొకించుకయైనఁ జేర నీ
కరయుచు మంచివారి ననయంబును బ్రోచుచుఁ జెడ్డవారలన్
సెరగులపాలు సేయుచును నేమము మీఱ జగమ్ము లేలుచుం
దిరముగ నుండినట్టి యలదేవరఁ గొల్చెద నెల్లయప్పుడున్.

వ. ఇట్లు జగమ్ములనెల్లం దల్లియుఁ దండ్రియు నేలికయునయి యెల్ల
యెడల నిండియుండు నాదండివేలుపు నుల్లంబున నెల్లవిరియు నింతం
తనరాని సంతసంబున మంతనంబున నెంతయుం గొనియాడి వేఁడికొని
యీమేటిదేవరకు నాపయింగల వెలలేని కూరిమి పేరిమిని నేనొన
రింపఁబూనిన యీక్రొత్తపొత్తంబునకు మొదలెట్టెదనిన. 2

తే. మున్ను నైమిశ మనుకాన నున్నయట్టి
తపసు లొకనాఁడు సూతుని తఱిని జేరి
భరతుకొలమునఁ గల రాచవారి కతలఁ
జెప్పుమని వేఁడ నతఁడిట్లు చెప్పఁ దొడఁగె. 3

సీ. సొగసుఁగోటలమీఁది మగఱాలసింగముల్
చౌదంతి పిచ్చులు జంకువఱుప
మేటియగడ్తలు వీటిబోటులకును
జిలువచెల్వాలతోడి చెలిమి నొసఁగఁ
బసిఁడిమేడలమీఁద నెసఁగుక్రాల్గంటుల
చెలువ మచ్చరబొంట్లఁ జిన్నపుచ్చఁ
బూవుఁదోఁటలలోని తావుల తేనియల్
చిఱుగాలువల వెంటఁ జేలఁదడపఁ

దాతఁ బాఱులు చదువులఁ దప్పఁబట్ట,
రాకొమరు లని రామునిఁ జౌకసేయ
బేరు లోఁకమిత్తెసికి బదుళ్ళాగ కొసఁగ,
వెలయు నేనుంగు పేరిటి వీ డొకండు. 4

వ. అందు. 5

తే. ఏకాలంబునఁ దగఁబుట్టి నోపుమీఱి,
సరిగ నహుషుండు వేల్పులసామి యయ్యె
నట్టి చందురువంగడ మందుఁ బొడమి,
శంతనుండను నొడయండు జగము నేలె. 6

తే. ఆపుడమిఱేఁడు మిన్నేటియందు నొక్క—,
కొడుకుఁగని భీష్ముఁడను పేరు కూర్మిఁ బెట్టి
చదువు సాములు నేర్పించి సంతసమున
నుండి యొకనాఁడు వేఁటకు నొకఁడు నేగి. 7

తే. జమునదాపునఁ దిరుగుచు నమరఁ గాంచెఁ
దొగలవిందును నగియెడి మొగముదానిఁ
బసిఁడి నిగ్గులెన్నడి మేఁమిసిమిదానిఁ
బడలెఁ గడపెడుదానిని బడఁతి నోర్తు. 8

క. కనుఁగొని జవ్వని సోయగ,
మునకు న్మదిలోన మెచ్చి మొనసినవేడ్కన్
దనవలపు బయల్పడ ని,
ట్లనియెం జేరువనుజేరి యా ముద్దియతోన్. 9

క. ఎవ్వరిదానవు నీవే,
రెవ్వరు మఱియోడ నిట్టు లేటికిఁ గడపన్
జవ్వనిరో యెఱిఁగింపుము,
నెవ్వడి నీతండ్రి యొవట నిలుచునొ నాకున్. 10

వ. అని యడిగి యప్పు డప్పడంతివలన నంతయుం దెలిసికొన్నవాఁడై
యా చేడియతోడఁ గూడం జని దాస తండ్రియగు బెస్తలతేనిం గని
తన యూరునుం బేరును నెఱింగించి యమ్ముద్దియం దనకిమ్మని
వేఁడిన నుల్లంబునఁ బెల్లు సంతసిల్లి యల్లన నడంకువ తోఁప నా
పుడమిఱేని కతం డిట్లనియె, 11

సీ. నాకూఁతు రిది కొన్నినాళ్ళకు ముం దొంటి
గా నేట నోడను గడపుచుండఁ
దపసి పరాశరుఁ డపుడు తాఁ జనుదెంచి
పడఁతుక నడపంగఁ బడవ నెక్కి
యేటిలోపలి దీవి కేగి యచ్చట దీని
వలచి కన్నెఱికంబు వాయకుండ
మెప్పులు తగనిచ్చి యొప్పించి మఱికూడి
వ్యాసుండు నాఁ జను పట్టినపుడ
పడసి నడచెను దనదారి మడఁతియొడలఁ
దావి యామడ దవ్వగుదాఁక వలపు
మక్కువనొసర్చి వ్యాసుఁడు నిక్కువంపుఁ
దపసియై యొక్కయడవికిఁ దానునరిగె. 12

ఉ. దీనిని మీకొసంగెదను దేవరకీబిడ గన్నపట్టినిన్
తేనిఁగఁజేసి మీకుఁగలనేలను నేలఁగఁజేయఁగావలె
న్నానకయింతపాటి చిఱుమున్నన యీఁదగు నన్నవిన్నవై
మేనువడంకఁగాఁ గదలి మెల్లననింటికిఁబోయి నెవ్వగన్. 13

ఆ. ఎల్లరాచపనుల నెడపెట్టి వలవంతఁ,
బాన్పుఁజేరి యొంటి వగరుచుండఁ
దండ్రి తలఁపుఁదెలిసి తడయక భీష్ముండు,
పల్లెదొరనుగలిసి పలుకులాడి. 14

సీ. తానువడుగుందన మూనంగ వట నెల్ల
వారును వినుచుండఁ బ్రతినవట్టి
జాలరిదొరతోడఁ జాల నమ్మికపుట్టఁ
బలుదెఱంగులఁజెప్పి పదిలపఱిచి
సత్యవతినిదెచ్చి సరగునఁ దండ్రికిఁ
బెండిలిగావించి పెంపుమెఱసి
తనచేతిబలిమిని ననిలోనఱేఁడుల
నందఱనోడించి యదిమి వారి
వలనఁ గప్పముల్గొని తండ్రినలరఁజేయ,
సత్యవతితోడికూటమిశంతనుండు
చెలఁగి చిత్రాంగదుండు విచిత్రవీర్యుఁ,
డనఁగనలరారుకొమరులఁగనియెనంత. 15

ఆ. వారు జవ్వనమును బడయకముందఱ,
శంతనుండు మేను జాఱవిడిచెఁ
దండ్రిచావఁ బెద్దతమ్ముని భీష్ముండు,
పుడమి కొడయఁడుగను-జూసిచేసె. 16

సుగంధి. పొంగి యొరిఁ బూరికైనఁ బోల్పకున్న మీఱఁ జి
త్రాంగదుండు పోరి కెల్ల దండివారిఁ జీరఁ జి
త్రాంగదుండు వేల్పుదిట్ట తాఁకి కయ్యమిచ్చి యా
పొంగడంచి మించి త్రుంచిపోయె వేయు నేటికిన్ 17

తే. అన్న పోయినపిమ్మట నతనితమ్ము,
నావిచిత్రవీర్యుని భీష్ముఁడపుడ తెచ్చి
దొరతనంబిచ్చి వెలయించిపరువమొదవి,
వెలయునతనికిఁ బెండ్లి గావింపనెంచి. 18

ఆ. కాశిఱేఁడు తనదు కన్నియలకుఁ బెండ్లి,
సేయ నెంచి యుంట చెప్పనరిగి
ముగురు కన్నియలను ముంగలనరదంబు,
పయినిఁ బెట్టుకొంచుఁబయికిఁబోవ. 19

క. ఎకిమీఁ లెల్లను దాఁకుడు,
నొకఁడు న్నగఁటిమి నెదిర్చి యుక్కటివారల్
గకవికలు గాఁగనమ్ముల,
సెక లన్మలమలను మాడ్చి చెదరఁగఁజేసెన్. 20

వ. మఱియును. 21

ఆ. చుట్టుముట్టినట్టి దిట్టలనందఱు,
నిలిచిపాఱఁదోలి గెలుపుఁగాంచి
త్రోవలోన సాళ్వుఁ దూలించి మరలించి,
వెలఁదుకలనుగొంచు భీష్ముఁడరిగె. 22

తే. అరిగి యంబ యంబాలిక యంబికయును,
ననెడుమూవురలోఁ బెద్దదైనయంబ
తనకు డెందంబుసాళ్వునిఁదవిలియుంటఁ,
దెలుపనాయింతినటకంపి తెరువుపట్టె. 23

క. తక్కిన యిరువురఁ దమ్మున,
కొక్కటఁ బెండిలిమొనర్చ నొప్పుగ నతఁడా
చక్కెరబొమ్మల తోడనె,
మక్కువతో నెపుడు నుండి మడిసెన్వేగన్. 24

సీ. సంతులేకుండంగఁ జచ్చిన కొడుకును
గని సత్యవతి భీష్ముఁగదియఁబిలిచి
యిల్లాలిఁగైకొని యిల్లుపల్వఁగఁబెట్టి
నేలయేలుమటంచుఁ జాలువఱకు

బతిమాలి చెప్పిన నతఁడించుకయు నొప్ప
కప్పుడవ్యాసుని నొప్పుగులుక
నెదలోనఁ దలఁచిన నేతెంచి యాతఁడు
తల్లికి మ్రొక్కిడిదండనిలిచి
యామెపంపున నంబికయందుఁబుట్టు
గ్రుడ్డిధృతరాష్ట్రు రెండవకొమ్మయందు
బొల్లివానినిఁ బాండుని బోనకత్తె,
యందు విదురునిఁ గలిగించె హాళిమీఱ. 25

వ. అందు. 26

తే. పెద్దవాఁడైన ధృతరాష్ట్రు బెంపుమెఱయఁ
బుడమిఁ బూన్చిన సరిఱేండ్ల నడఁగఁద్రొక్కి
విదురుమదిబల్మి భీష్ముని వింటిబలిమి
తనకు సాయంబుగా దొరతనము చేసె. 27

తే. అంత గాంధారమనునేల నమరనేలు,
సుబలుఁడనుఱేనికూఁతునుసోయగమున
నచ్చరలమించు గాంధారి యనెడుదాని,
భీష్ముఁడాయెకిమీనికిఁ బెండ్లిచేసె. 28

మ. మఱియు న్వేలుపుటేటిపట్టి కరమున్మన్నించి పూఁబోఁడ్లఁబ
ల్మఱుఁదేరన్ ధృతరాష్ట్రుఁడాంధ్రుగను గేల్వట్టిందగనూర్వురన్
జాఱుకుంజందముమీఱఁ బాండుఁడును మిన్కుల్నాములున్నేర్చి యం
దఱిలోఁ బేరిమిఁగాంచి మించుటయు నంతంబెండ్లి గావింపఁగన్. 29

క. తలపోసియు వసుదేవుని;
చెలియలి శూరుఁడనువాని చెలువపుఁగూఁతుఁ
వెలయఁగఁ బెండ్లిచేసెను,
వెలఁదుకఁ గుంతి యనుదాని భీష్ముఁడు వేడ్కన్. 30

సీ. అదిమును దనతండ్రి యానతి దుర్వాసుఁ
దనుతపసికి నోరె మమరఁబెట్టి
మెప్పించి యతనిచే నెప్పుడు తలఁచిన
నప్పుడ వేలుపు లరుగుదెంచి
బిడ్డలనిచ్చెడు పెనుమెప్పుఁగైకొని
యొకనాఁడు సంభ్రంపు టొడ్డునందుఁ
దమ్ములవిందును దలఁచి యాతనివల్లఁ
బుట్టుజోడును జెవిపోఁగులున్న
కొడుకుఁగని వానిఁ బెట్టెఁతోఁ గడలినిడియెఁ
గొట్టుకొనిపోయి యాబొట్టె గట్టుఁజేరఁ
గాఁపొకఁడు వానిఁ గొనిపోయి కర్ణుఁడంచు
రహిని బేరుంచి తనచాన రాధకిచ్చె. 31

తే. మాద్రియనుదానినా వెన్క—మఱియుఁ బాండుఁ,
డాలుగాఁగొనియిద్దఱనలరఁజేసి
దెసలనెల్లను దనవాఁడిమెనఁగగెల్చి,
యన్న చే నెన్నొ చేయించెజన్నములను. 32

సీ. అటులుండి యొక్క—నాఁడాంధ్రనుదనత్రోడఁ
గొనివేఁటతమిమిగాఱఁగొంతదవ్వు
కానలోపలనేగి కానక మెకములఁ
గూడిపొందెడునట్టి లేడి నిట్టి
నొకకోల నేలపై నొఱగింప మగజింక
జడదారిరూపును సరగఁదాల్చి
యీవు నీయాలితో నెప్పుడుకలసెదో
యప్పుడ మావలె నయ్యెదంచుఁ

దిట్టి చచ్చిన దిగులొంది దిటముపూని,
యింటివంకకు మరలక యెఱుక మెఱసి
తపసితనమూని కొన్నాళ్ళు తాళియుండి
సంతు లేమికి నెంతయు వంతనొంది. ౩౩

ఆ. కుంతిఁ జేరఁ బిలిచి కొబ్బునదనకోర్కి,
తేటపఱిచి వేఁడ బోటియొట్టి
కేల కొప్పుకొనియుఁ గెలసి యుధిష్ఠిరుఁ,
డనెడి కొడుకుఁ బడసె నజ్జమునికి. ౩౪

శా. ఆచోటన్ ధృతరాష్ట్రుకొయ్యాలియు నొయ్యన్ వేఁకటిం దాల్చి ము
న్నే చూలాలయి కుంతి పట్టిఁ గని తా నెంతో మదిం గొంగుటల్
చూచాయన్విని యోర్వలేక వగతోఁ జొక్కుచుండి లోఁగుంది యా
మ్మాచెన్నారు నెలంత గ్రుద్దుకొనెఁ బాడై చూలొగిన్ జాఱఁగన్.

వ. అట్లాకొమ్మ ఆమ్మ కరము వమ్మగునట్లుఁగా నోగమ్మగాఁ
గ్రుమ్ముకొన్న నెత్తుచెడి క్రొత్తనెత్తురులం జొత్తిల్లి తుత్తునియలయిపడ్డ
కండముత్తములనెత్తి క్రొత్తకడవలలోనం బెట్టించి వ్యాసుండు
నూఱువురఁ గొడుకులను నొర్కకూఁతును బుట్టించె. వందుఁ బెద్ద
వాఁడు దుర్యోధనుండును రెండవవాఁడు దుశ్శాసనుండును వారి
చెల్లెలు దుస్సలయు ననంబరఁగి పెరుఁగుచుండిరంతనిచ్చట. ౩౬

క. అట దుర్యోధనుఁ డొదవిన
దిటముగు నానాఁడె గాలిదేవర వలనన్
దటుకున భీముని గనియెను
నిటఁ గుంతియు మగఁడు పనుప నెంతయు నెలమిన్. ౩౭

క. ఆపిమ్మట వేలుపుదొర
నాపోవక మగఁడు వేఁడ నానఁతియోఁగా

నాపగిది నర్జునుండను
పాపనిఁగని మించెగొంతి బలియుని మిగులన్. 38

క. పెనిమిటి సెలవొసఁగంగాఁ
దనసవతియు నేర్పిపనుప దామాద్రియునుం
గనె వేలుపు వెజ్జుల కొ
య్యానకులుండు సహదేవుఁడనియెడి కవలన్. 39

ఆ. ఇట్లు నేలఁతలంగు నేవురు కొడుకులఁ
బడసి సంతసమునఁ బ్రబలియుండి
యేకతంబ మాద్రియెక్కుడు సోయగం
బొక్కనాఁడు చూచి యోర్వరాక. 40

క. వెలుపన్న దాయల నెందఱి
గెలిచియుఁ దనలోని దాయ గెలువఁగలేకా
బలియుఁడు పాండుఁడు మడిసెను
వలపున నిల్లాలితోడ వడిఁ గలయుటచేన్. 41

తే. అంతమాద్రియు మగనితో నగ్గిసొచ్చె
గొంతిపాటులు వెంటరాఁగొండవిడిచి
కొడుకులను వెంటఁగొని బావకడకువచ్చె
నెల్లవారికిఁ దముఁజూచి యుల్లమవియ. 42

ఉ. కుంతియు బిడ్డలం గొనుచుఁ గూరిమి పెన్మిటిఁ బాసివచ్చుచో
వింతగఁ జూడవచ్చి రలవీటను గల్గినవారలెల్లఁదా
మెంతయు వంతఁబనివి యేడ్చుచు నాధృతరాష్ట్రుఁడాలునుం
గుంతిని వెంటఁబెట్టుకొని కుఱ్ఱలఁదోడ్కొనిపోయి రింటికిన్. 43

వ. అంత ధృతరాష్ట్రుండు. 44

క. తనబిడ్డలు నూఱే తన త
మ్మునిబిడ్డలు నంచు వేఱుపూనిక నదిలో

నను బూనక కొడుకులక
న్నను ప్రేముడి మీఱఁ బెంచె నలి నేపురనున్. 45

సీ. దుర్యోధనుండును దోడివారును దమ్ముఁ
గుఱ్ఱలుఁ బాండుని కొడుకు గమియు
నల్లారుముద్దుగా నాటపాటలఁ బ్రొద్దు
పుచ్చెడు తఱిగాడ్పు ముద్దు పట్టి
బలిమి నందఱమించి పలుదెఱంగుల నొంచి
పలువుర నొక్కటఁ బట్టికొట్టుఁ
జెట్ల నెక్కినవారిఁ జెట్లూఁచి పడవైచు
నిలిచి పొల్చినవారినీటముంచు
నిట్లువడముడి కడగండ్ల నెపుడుఁగుడుప
నీరసంబెత్తి తాళఁగా నేరకపుడు
తనదు మామను శకునిసి దగవునడిగి
తొడరిదుర్యోధనుఁడు చేసెదుండగముల. 46

సీ. నిడు తీవియలఁగట్టి నిదురించు తఱినేటఁ
బడఁద్రోయ మేల్కనివెడలివచ్చె
విసముతోడనుజేర్చి వెసఁగూడు వెట్టింప
నారగింపఁదడవ యరిగిపోయెఁ
బండుకొన్నప్పుడు పాములఁ గఱపింపఁ
గీడొకింతయు లేక కెడపెవాని
దుర్యోధనుఁడుసేయు దొసఁగులు మఱియును
వడముడిఁ జెందకవమ్ములయ్యె
నంత మనుమలఁ జదివింప నద నటంచు
నెఱిఁగి భీష్ముఁడు కృపునొద్ద నెల్లచదువు

లమరఁజెప్పించె మొదలనాకొమరులకును
బిదపద్రోణుఁడునాఁజనుచదువులయ్యె. 47

తే. నేలవేలుపు కృపుబావ చాలవలఁతి,
తనకొమారు నశ్వత్థామఁగొనుచువచ్చి
వీఁడు నేరిన నా నేలవేల్పునొద్ద,
వెనుక విలువిద్దెఁ గఱపించె మనుమలకును. 48

సీ. కవ్వడి తనకోర్కెఁ గడువడిఁ దీర్చెద
నని బాసయిచ్చిన నలరి ద్రోణుఁ
డతని కెక్కువచెప్పెనామీఁదనొకనాఁడు
రాకొమారుల నేర్పరయఁగనఁగ
మిన్నేటికొమరుండు మున్నుగు వారికి
విన్నవించినవారు వేడ్కతోడఁ
గొలువుండి చూడంగ వెలయించి రెల్లరుఁ
దమతమ నేర్పు చందమ్ములెల్ల
నందు దుర్యోధనుఁడు భీముఁడడరితాఁకి
గుదెలఁబోరవారిని ద్రోణుకొమరుఁడడిపె
నర్జునుండును విన్నాణ మమరఁ జూపి
మారు లేకుండ నొక్కఁడు మలయుచుండె. 49

క. అక్కడ కప్పుడు కర్ణుం,
డక్కునఁ జనుదెంచి క్రీడి నొక్కటఁ దాఁకన్
బెక్కు తెఱంగులఁ బోరిరి,
యొక్కొకరికి వట్రుపడక యోరిమిపేర్మిన్. 50

క. పోరెడియప్పుడు కర్ణుని,
బీరంబున కెదను మెచ్చి వేయంగము నాఁ

జేరైన నేల నతనికిఁ,
దోరం బగుకూర్మి నిచ్చి దుర్యోధనుఁడున్. 51

వ. అతనితోడి చెలిమి కలిమి ననిలోనం దన పినతండ్రికొడుకుల నాతండు గెలువఁగలం డను గట్టి నమ్మకమ్మున నాతనిం దనయొద్దఁ బెట్టుకొని సంతసించుచుండెనంత. 52

క. తనవలనఁ జదువుగఱచిన,
యనినేసెడు రాచవారి నందఱ ద్రోణుం
డును జేరఁ బిలిచి ద్రుపదునిఁ,
దనకడకును బట్టి తెండు తడయక యనుడున్. 53

సీ. అందఱు నరదంబు లాయితంబుగఁ జేసి
వెలువడి ద్రుపదుని వీడు చేరి
కోటలు పడద్రొబ్బి క్రొత్తడంబులు గ్రొచ్చి
యూరెల్ల దల్లడమొందఁ జేయ
ద్రుపదుఁడు విని వచ్చి దుర్యోధనుఁడు లోను
గాఁగల మగలను గదిసి తాఁకి
వాలంప గుంపుల వానలు గురియించి
చిందఱ వందఱ జేసి దండు
నెల్లచోటులఁ దానయై యేపు చూప,
వెఱచఱచి పాఱి రందఱు వీఁకచెడుచు
నంత విప్పచ్చుఁ డాతని నడ్డగించి,
తోడ భీముఁడు గుదెఁబూని తోడుసూప. 54

క. తననేర్పు మెఱయఁ దూపులఁ,
గనలునఁ బరఁగించి ద్రుపదుగరువంబడఁగన్
జని పట్టి కట్టి తెచ్చెను,
గనువారలు డెందములను గళవళ పడఁగన్. 55

ఆ. అట్లుపట్టి తెచ్చి యాతని నొజ్జల,
కాళ్ళమీఁద వేయఁ గనికరమున
నుల్లసంబు లాడి యొడయనిఁ బొమ్మని,
క్రీడి ద్రోణుఁడుగొనియాడి మెచ్చె. 56

చ. ద్రుపదుఁడు దొంటికంటునను ద్రోణుఁడు తన్నటు చిన్నపుచ్చఁగా
దపసితనంబు పూని కడుఁదాలిమి వేల్పులఁ గొల్చి ద్రోణున
చ్చపుఫుబవరంబునం గెడపఁ జాలు కొమారుని దిట్టయైన వే
లుపుదొరపట్టి యూలయి వెలుంగుకొమారితఁ గాంచెఁ జిచ్చునన్. 57

క. కని యిటు దృష్టద్యుమ్నుం
డనుచుఁ గొమారునికిఁ గృష్ణయని కూఁతునకుం
దనరఁగఁ జేల్లిడి ప్రోలికిఁ
జని ద్రుపదుఁడు వింతసంతసంబున నుండెన్. 58

వ. అంతనిచ్చట. 59

తే. విద్దెచేతను గొనముచేఁ బెద్దయైన
జముని కొమరుని రాచటికమునఁ దనకు
సాయముగఁ జేసికొనితానుసంతసంబు
నొందుచుండెనుధృతరాష్ట్రుఁడుద్ది లేక. 60

ఉ. అప్పుడు తమ్ము లెల్లకడలందును బోరుల గెల్పుఁ గాంచుచుం
జెప్పెడి దేమి పేరుగల చిక్కనిజేఁడుల నోర్చి వారిచేఁ
గప్పము లెంతయుంబలిమిఁ గైకొని యన్నకుఁ దెచ్చియిచ్చుచున్
గొప్పతనంబు వాసియును గూర్పఁగ నోరువలేక యీసునన్. 61

సీ. మంతనంబున మేనమామను శకునిని
దుస్ససేనునిఁ గర్ణుఁదోడి తెచ్చి
దుర్యోధనుఁడు వానితోడను దలపోసి
యాకటుపులఁ బట్టి యయ్యకడకుఁ

జని కన్నులనునీరు జాఱఁగ నురపిల్లి
యెట్టకేలకు తేనియొలుక చెఱిచి
పాండునికొడుకుల వారణావత మనునూర
నుంచెదునట్టు లొప్పుకొనఁగఁ
జేసి వచ్చినవారలఁ జేరఁబిలిచి,
తల్లితోఁగూడి యేవురుఁ దరలునట్లు
నేర్పుతోఁజెప్పి ధృతరాష్ట్రుఁ డేర్పడంగఁ,
బుచ్చెమేలెంచకప్పుడాప్రోలికరుగ. 62

సీ. దుర్యోధనుం డంతఁ దొడరి పురోచనుఁ
డనువాని రావించి యతనితోడ
మంతనంబునఁ గొంత మాటాడి మునుచని
లక్కయి ల్లొక్కటి చక్కఁగాను
వారణావతమున వడిఁగట్టి గొంతియుఁ
గొడుకులు నందుండి కూర్కియుండు
తఱినిప్పుముట్టించి తడయకరమ్మని
చెప్పి పుచ్చినవాఁడుఁ జెలఁగి యరిగి
లక్కయిల్లుకట్టి చక్కఁగఁ గై సేసి
యునుపఁ గుంతిబిడ్డ లుండిరందు
నంత విదురుఁ డిచట నంతయుఁ బరికించి
కీ లెఱింగి సరగఁ గీడుతొలఁగ. 63

ఉ. ఉప్పరవాని నొక్కరుని నొంటి యుధిష్ఠిరు పాలికంప నా
చొప్పెఱిఁగించి వాఁడు కడు సూటిగ నేలసొరంగ మొందు నే
ర్పొప్పఁగఁ ద్రవ్వి చూపుటయు నోయనభీముఁడు తల్లినన్ననుం
దప్పక తమ్ముల న్వెలికిఁ దార్చి సొరంగము దారి దవ్వుగన్. 64

క. పనిచి పురోచనుఁడును జెం,
తను గొడుకు లయిదుగు రేలుకతయు నిదురింపం
గని లక్క యింటి కగ్గిని,
గనలునఁ దగిలించిపోయెఁ గడునడురేయిన్. 65

క. ఆరాతిరి యాయిల్లటు,
గోరముగాఁ గాలిపోవఁ గూరిన వగతోఁ
నూరను గలవారెల్లను,
జేరువఁ జనుదెంచి కాంచి చిడిముడిపడుచున్. 66

క. గొంతియుఁ గొడుకులుఁ దెగిరని,
యెంతయు వగఁబొంది యేగిరిండ్లకునచ్చో
నంతయు దృతరాష్ట్రుఁడు విని,
యింతం తనరాని కస్తి నెదలోఁ బొందెన్. 67

ఆ. గాడ్పుపట్టి యచటఁ గన్నతల్లిని దోషఁ,
బుట్టువులను మీఁదఁ బెట్టుకొంచు
ముండులనక పెద్ద గండులనక యేగెఁ,
గాఱుకానలందుఁ గరము దవ్వు. 68

ఆ. రేయి వారు వడెడి రాయిడిఁ బాపంగ,
నెంచియపుడు వెలుఁగుఁబంచెదయ్య
మనఁగఁ బ్రొద్దుపొడిచె నావల నాఱ్వురు,
నెండ యెక్కుదాఁక నేగి యేగి. 69

క. కడుబడలి యెండతాఁకున,
వడగొట్టిన బిట్టుసోలి వారలుపడఁగా
వడముడి నీళులకొఱకుం
గడుదవ్వుగఁ బోయి మరలి కదిసెడుఁగొనన్. 70

తే. ప్రొద్దువాలినఁ గెంజాయ పొదలిపిదపఁ
గాఱుచీఁకట్లు మింటను గ్రమ్ముకొనిమె
ఱేవెలందుక దాల్చిన కావికోక
విడిచి నల్లని చీరను దొడిగె ననఁగ. 71

క. ఆచీఁకటిలో నీళుల
మోచుకొనుచు వచ్చి చెట్టు మొదటనుగూర్కం
జూచియు వారల లేపక
కాచుకొని యతండు నిలిచెఁ గడుఁ గడిమి మెయిన్. 72

సీ. అప్పుడక్కానలో నెప్పుడునుండు హి
డింబుఁడన్ రక్కసుఁ డిమ్మునుండి
వారలఁ గని పొంగి వడిపడిఁ జెలియలిఁ
బనిచె హిడింబను వారిఁ బట్టి
వంటకుఁ దేనాపె వడముడిఁ దిలకించి
వలపున మోమోటపడుచు నిలువ
నేజామునకుఁ జెల్లెలేతేరమికి నల్గి
పయనమై మఱి తానె వచ్చినిఁగూడ
భీముఁ డాతని దవ్వుగాఁబిఱిఁది కీడ్చి,
దొమ్మికయ్యమ్ములో వానిఁగ్రుమ్మిచంపి
యున్నపనుపఁగఁ దల్లియు నవ్వుననంగఁ,
బెండ్లియాడె హిడింబను బేర్మితోడ. 73

తే. దానితోఁగూడి కొన్నాళ్ళు కానలందుఁ
బగలు వలరాచపనులను మిగులఁ బెనఁగఁ
బుట్టెఁదగ ఘటోత్కచుఁ డనుపట్టియొకఁడు
వాఁడితనమును జిత్తులు బలిమిగలిగి. 74

చ. తలఁచినయప్పుడెల్ల నిముదాకొని వచ్చెదనంచుఁ జెప్పి యా
బలియుఁడు తల్లిఁదోడుకొని వారల వీడ్కొని యేగెనిచ్చమై
వెలువడి యేకచక్రమను పేరిట యూరికిఁ బోయి రన్నయున్
నలువురుతమ్ములు న్త్వరపునం దమతల్లిని గొంచుఁగాల్నడన్. 75

వ. అట్లుపోయి. 76

తే. నేలవేల్పుల వేసంబు లోలిఁ దాల్చి,
యొక్కబాఁపనియింటనునుండియూరఁ
దిరిప మెత్తుచుఁ బ్రామిన్కు లరసికలచు,
చుండిరేవురు సైదోడులొజ్జలొద్ద. 77

సీ. ఆకుప్పమున బకుఁ డనురక్కసుఁడొకండు
కాఁపురంబుండి యక్కడనునున్న
వారి నేప్రొద్దు నిల్వరుసను నొక్కని
బండెఁడు కూటినిఁ బసుల రెంటిఁ
దడవులనుండి సాపడుచుండు నట్లుండ
నొకనాఁడు పొలదిండికోరెముగను
బోవలసిన వంతు పొందుగా వారున్న
పుడమివేలుపు పాలఁ బడిన నతఁడు
మిన్నువిఱిగి పడిన చెన్నున నేమియుఁ
దోఁపకాలుఁ దానుఁ దోడివారుఁ
గూడి యొక్కపెట్ట గొంతెత్తి యేడ్వంగఁ
జొచ్చె గొప్పముప్పు వచ్చెననుచు. 78

క. ఆయేడుపు విని గొంతియు
డాయంగాఁ బోయి యడిగి డగ్గుత్తికతో
నాయింటి పాటుఁ దెలుఁగం
జేయుచు వడి భీముఁ జేరి చెప్పిన నతఁడున్. 79

క. ఒడ లుప్పొంగఁగ రక్కసుఁ
గడ తేర్చెద నంచుఁ బలుఁకగా నాపాఱుల్
కుడువంగఁ బెట్టిరోరెము
వడముడికిన్నంచి పిండివంటలతోడన్. 80

చ. అటువలె నారగించి కఱవాఱఁగ సత్తువపట్టి లేచి మి
క్కుటముగఁ దొంటి వంటకమెకూర్చినబండిని నెక్కిరక్కసుం
డటుకునఁ జేరి మాఱుకొని తన్నియుఁ గ్రుమ్మియు నట్టకేలకుం
బెటపెట నెమ్ముకల్వఁజేచి పీఁచమడంచెను నొక్కవేల్మిడిన్. 81

సీ. అమ్మాడ్కి బకుఁ జంపి యందఱ నలరించి
నెమ్మదినుండంగ నెమ్మి మీఱ
బసచేసి యున్నట్టి పాఱునియింటికి
జన్నిగ ట్టొక్కఁడు సరగవచ్చి
ద్రుపదుండు తనకూఁతు ద్రోవదిఁ గొనఁగోరు
రాచకొమాళ్ళెల్ల రావలెనని
చాటింప నాలించి జగములోఁ గలరాచ
వారెల్ల నచటికి వరుసగాను
బోవుచున్నారు నేనును బోదునటకు,
నీవి మిక్కిలి బాఁపల కిత్తురంచు
విన్నవాఁడను గావున వేడ్కతోడ,
ననుచుఁ జెప్పిన నలరారి యపుడకదలి. 82

చ. బసదిగియున్న పాఱుతను బాఱుని వీడ్కొని గొంతి బిడ్డలున్
వెసఁ జని యొక్కటన్ ద్రుపదువీటికిఁ బోయెడుదారి వ్యాసుతోఁ
బొసఁగఁగ మాటలాడి వడిఁ బోవుచు వేలుపుటేటి చెంతనా
నిసితఱిఁ గ్రీడి చేకొఱవి నెయ్యమునం గొనిత్రోవ చూపఁగన్. 83

ఆ. ఏగుచున్నయప్పు డింతితో నంగార,
పర్ణుఁ డనెడు వేల్పుపాటకాఁడు
తిరుగులాడుచుండి దిటముగ నర్జునుఁ,
దాఁకి తూపు లొడలు దవుల నేసె. 34

క. ఏసినఁ గవ్వడి వడివడి,
నీసుమెయిం జిచ్చఱమ్ము నేర్తెఱ వైవన్
గాసిలి యరదముఁ గోల్పడి,
యోసరి యంగారపర్ణుఁ డుడిగిన కడిమిన్. 35

తే. కదలివచ్చి యుధిష్ఠిరుకాళ్ళ వ్రాలి
ధౌమ్యుఁ డనునొజ్జ నొడఁగూర్చి తగవునెఱపి
చిచ్చఱమ్మును గవ్వడిచేతఁ బడసి
యింతిఁ దోడ్కొని తనయిచ్చ నేగెనంత. 36

సీ. పాండుని కొమరులు నిండువేడుకతోడ
ద్రుపదుపీటనుజేరి యుపముమెయిని
గుమ్మరవానింట నిమ్ముగా దిగియుండి
యొకమీండ్లు గుమిగొన నేగియున్న
రచ్చతావునకేగి రచ్చట ఱేఁడులు
మిన్నంటఁ గట్టిన మీనునీడ
క్రింది నీళులఁజూచి ముందఱ మోపెట్టి
యున్నవింటిని జేత నొనరఁ దాల్చి
నింగి మచ్చెంబు నేయంగ నేర్పుమెఱసి
యెత్త లేరైరి యొకకొంద ఱెత్తియేయఁ
జాలకుండిరి కొందఱు చాలువఱకు
నేసికొట్ట నోపక విడి రాస లెదల. 37

క. అప్పుడు కన్నడి పాలుని,
మొప్పునఁ జనుదెంచి నిలిచి యొకచే వింటిం
జప్పున మోపిడి యేసెను,
నప్పుడ మచ్చియపుజంత్రమరతెగి పడఁగన్. 88

తే. దానిఁ గన్గొని దొరలెల్ల నాన పూని
ద్రుపదు నడఁగింపఁ దొడరినఁ దోడుచూపి
కర్ణు నర్జునుఁ డోడించెఁ గడిమి మెఱసి
భీముఁడోడించి శల్యుని బెగడువఱిచె. 89

తే. అంత సిగ్గున దొరలెల్ల నరిగి రిండ్లు,
కవల ద్రోవది నర్జునుఁ డరదమునను
బెట్టుకొనివచ్చి తల్లితోఁబిచ్చ మొకటి,
తెచ్చితినటన్నఁగలహంపు దెలియకామె. 90

క. ఏవురునుం గైకొనుఁ డని,
యావల ద్రోవదిని జూచి యలజడిపడఁగా
నావడి వ్యాసుం డచటికి,
వేవచ్చి తెఱంగు చెప్పి వెంటనె వారిన్. 91

క. ద్రుపదునికడకుం గొనిచని
యపురూపపుఁ గతలుచెప్పి యైదుగురకు నొ
క్కపడఁతి ద్రోవది నియ్యఁగ,
నపుడె యొడంబఱిచి యేగెనతఁడుతనంతన్ 92

ఉ. అంతట మంచి మూర్తమున నందఱు నెయ్యురఁ జుట్టపక్కములో
వింతగఁ జూడ రాఁగఁ గనువిందుగ నాద్రుపదుండు కూఁతునున్
సంతస మారఁదెచ్చి వరుసం జముప్పట్టికి గాఙ్పుపట్టికన్
వంతునఁ గ్రీడికి న్గవలవారికిఁ బెండిలిచేసె వేడుకన్. 93

సీ. పెండిలి నడచిన వెనుకను గొన్నాళ్ళు
పాండుని కొడుకులు పదిలముగను
ద్రుపదుని ప్రోలనె తోడాసపడియుండ
వాలించి ధృతరాష్ట్రుఁ డలరి మదిని
గొడుకులు మఱిదియుఁ గూడిచెప్పినయట్టి
చెనఁటిమాటలఁ బెడచెవులఁబెట్టి
విదురుఁడు ద్రోణుండు భీష్ముండుఁ గలిపిన
హితవును విని చాల నెఱుకమీఱ
విదురు నెలమిని ద్రుపదుని వీటి కంచి,
పాండుకొమరుల రప్పించి వారికపుడ
సగము నేలకు దొరతన మొసగినొసంగి,
ఖాండవ ప్రస్థమున నుండఁగాను బనిచె. 94

ఉ. అప్పుడు కృష్ణుఁ డాయికను సచ్చటికిం జని వేల్పు తేనితోఁ
జెప్పుడు విశ్వకర్మ బనిచె న్నగరొక్కటిఁ గట్టు నాతఁ డా
చొప్పునఁ బంపఁగాఁబసుటు సూటి యెలర్పఁగ విశ్వకర్మ తా
నొప్పుల కెల్ల నున్కియయి యుండెను వీటినిగట్టి దానికిన్. 95

వ. ఇంద్రప్రస్థం బను పేరువెట్టి నెట్టన గాద్పుపట్టియున్న కిచ్చిన నచ్చోలు
వున కచ్చెరువడి పాండుతంను తమ్ములుం దానును నొక్క మంచినాఁ
డందుఁజొచ్చి తక్కుంగల నేల యేలికలెల్లఁ దన కరిగాఁపులుగా
నుండ నిండు వేడుకతోడ నేల యేలుచుండె నంత నొక్కనాఁడు. 96

క. వేలుపుఁ దపసియుఁ దగ నా,
ప్రోలికిఁజనుదెంచి కాంచి ద్రోవదితోడం
బోలఁగ నొకయేఁ డొకఁడుగ,
నోలిని నుండంగఁ బనిచి యొండొకకడపన్ 97

సీ. పగిన నొకని వేఁపురు నొక్కొక్క
 యేఁటను గూడుట కియ్యకొనుచు
నొకరితో నుండ వేఱొకరు చూచిన నేల
 నొకయేఁడు వలగొన నొక్కకట్టు
చేకొనియుండంగ వేకువ నొకనాఁడు
 పుడమివేల్పొక్కఁడు వడిగ వచ్చి
తనయావు నొకదొంగ కొనిపోవుచున్నాఁడు
 విడిపింప రమ్మని విన్నవింప
విల్లునమ్ములుఁ గైకొన నల్ల బోయి,
యన్నతో నున్నద్రోవది నపుడు చూచి
పుడమిఁ దిరుగంగ నివ్వచ్చు డెడము సేయ,
కపుడె వెల్వడె నెవ్వ రేమన్న వినక. 98

ఆ. నేలవేల్పు మొదవు నిముసంబులోఁ దెచ్చి,
యిచ్చి పుడమిలోని యేళ్ళఁ గ్రుంక
వెడలి యొక్కనాఁడు విన్నేటిలో మున్గి,
యొద్దుతఱిని వేల్వ నున్నతఱిని. 99

క. వలపున నాతనిఁ గొని చని,
చిలువ వెలందుక యులూచి చెచ్చరఁ దనదా
నెలవునఁ జేరిచి క్రీడిం,
గలయ నిరావంతుఁ డనెడు కంటువు పుట్టెన్. 100

క. ఆవెనుక న్మణలూరిని,
జేవమెయిం జేరి క్రీడి చిత్రాంగదనున్
వావిరిఁ బెండ్లాడి పడసె,
నోవక మఱి బభ్రువాహనుం డనుకొడుకున్. 101

సీ. అచ్చోటఁ గొన్నాళ్ళు విచ్చలవిడినుండి
మామను నీడ్కొని సేమమునను
ద్వారకకును బోయి దగ్గఱ రైవత
కంబుకొండను గదిసి యచట
నుండంగఁ గృష్ణుఁడు నిండువేడుకతోడ
నచ్చటి కరిగి వివ్వచ్చుతోడ
మాటాడి యేగి యామమునాఁడు తనవీటి
వారిని బంధుగు పేరుపెట్టి
తోడుకొనివచ్చి యటమున్న దొంగకావి,
తాల్పు వేసంబు నచ్చోటఁదాల్చియున్న
క్రీడి కందఱ మ్రొక్కించి వేడుకలర
నతని నింటికిఁ గొనిపోయి యవల నునిచి. 102

క. తనచెలియ లగు సుభద్రను
బనిచెను సన్యాసియొద్దఁ బనిసేయంగా
నెవరున నర్జునుమది యా,
ననఁబోఁడిం దగులు కొత్తఁగి నగరున నొకచోన్. 103

తే. కోరికలుజాజిపొలఁతుల కూర్మితీఱి,
జగములోఁబోడలగుచెందుసాజనురయఁ
గోరికలుమీాజిపొలఁతులకూర్మిఁగోరి,
యక్కజంబుగఁదాబోడయయ్యెఁగ్రీడి. 104

సీ. ఉవిదపై దవిలిన యుల్లంబుతోఁ గ్రీడి
కనువిందుగాఁ బనుల్ గొనుచునుండ
మాతనంబునఁగృష్ణుఁడంతయుఁదలిదండ్రు
లకు జెప్పియొప్పించియొకటఁబెండ్లి

పనులెల్లసాగించి పండువు పేర్వెట్టి
బలరాము నొకదీవి పజ్జకంపి
పెండిలిగావించి వెలఁదిని మఱఁదిని
నదురేయితన తేరువడిగనిచ్చి
యంపవారును దేరెక్కి యరుగుచుండ,
నూరి కావలివారెల్ల నొకటఁ గాఁకి
యార్చి పేర్చినఁ గవ్వడి యోర్చి వారిఁ,
బెరలఁగాఁ జేసెనుసుభద్ర తేరుగడప. 105

చ. అటువలెఁ గ్రీడి మాఱుకొని యాఁపతిఁగూపరఁ జేసి చేడియం
దటుకున వెంటఁబెట్టుకొని దారిని సాగి యసంబు పస్వఁగా
దిటమున నూరుచేరి తన దిట్టతనంబును నెల్లవారు మి
క్కుటముగఁ జెప్పుకోఁగఁ బెనుసూరిమిఁ దొయ్యలితోడ నుండఁగన్.

క. కొడుకభిమన్యుండనఁగను,
బొడమె సుభద్రకును దండ్రిఁ బోలెడు సూపుం
గడిమియుఁ బ్రోడతనంబును,
వడియును బీరంబుగలిగి బలువిలుకాఁడై. 107

వ. మఱియు నప్పాండుని కొమాళ్ళకేవురకు న్వరుసగాఁ గొడుకులేవురు.

క. ప్రతివింద్యుఁడు శ్రుతసోముఁడు,
శ్రుతకీర్తియు ననఁగ మొదలసారిదినివెనుకన్
జతగ శతానీకుండును,
శ్రుతసేనుఁడుఁ బుట్టిరపుడు ద్రోవదియందున్. 109

సీ. కవ్వడియొకనాఁడు దవ్వులయడవికి
వెన్నునితోఁ గూఁడి వేఁటకరిగి
నేలవేలుపుసూపుఁ దాలిచియచ్చోట
వెసమెలంగెడి వేఁడివేల్పుఁజూచి

మున్నొకరాయెకిమీఁదు జన్నంబుగావించి
మిగుల నేతివేల్పఁ దెగులువొడమి
తన్నుఁగాఱించుట విన్నవించినవిని
తగుమందు ఖాండవమగుట తెలిసి
యగ్గివేల్పుచే గాండివ మనెడువిల్లు,
పడసివేల్పురాయనితోఁట వడిగఁజొచ్చి
కాల్పనాతనిఁ బురికొల్పఁగడఁగిచిచ్చు
తోఁటలోఁజొచ్చి మంటలు ఘోరముగను. 110

క. కాలువఁ దొడరినఁ గనలున
వేలుపుదొర యడ్డుసొచ్చి వెసమబ్బులచేఁ
జాలఁగ వానలు గురిసినఁ
దూలక యవ్వానిఁ గ్రీడి దొలఁగఁగఁజేసెన్. 111

క. దానికిఁగాఁజేజేదొర
పూనికొని దురంబొనర్ప ములుకులు పెక్కుల్
మేనన్నాటించి కలఁచి
జానుచెడంజేసి క్రీడిసరగం బఱపెఁ. 112

చ. మయుఁడనువాని నయ్యెడను మంటలుబిట్టుగఁ జుట్టుముట్టినన్
మొయివడఁకంగ వచ్చివగమీఱఁగఁ గ్రీడి మఱుంగుసొచ్చినఁ
గుయివినజాలిపుట్టి యెదఁగూరిమి మీఱఁగఁ గాచెనాతనిన్
మయుఁడును దానికల్లమున మల్లడినొందెడు సంతసంబునన్. 113

క. సెలవుంగొని చనియెను న
వ్వలఁదగ నావేడివేల్పు వడిఁదనియంగా
నలరుందోఁటను గాలిచి
యెలమిని జెవులెల్లఁబాసి యిచ్చంజనియెఁ. 114

వ. అంత నొక్కనాఁడు. 115

క. పాండుని పెద్దకొమారుని
యండను గఱివేల్పుతోడ నచ్చోటను గూ
ర్చుండినకవ్వడి కిట్లనె
దండముగావించి మయుఁడు తద్దయు నెమ్మిన్. 116

క. నెవఱున నునుఱులు నిలిపిన
కనికరపుంగనికి నొకటి కైకొనిచేయం
గనునేర్తు నెయ్యెనను నే
నొనరంగ నాచేతనైన నదొక్కటి సేతున్. 117

తే. చేయివిచ్చఁగించినవాఁడఁజెలఁగినన్నుఁ
బనుపుఁ బెద్దయైనను నొక్కపనియొనర్ప
నేను రేద్రిమ్మరులలోన నెక్కుడైన
నేర్పుగలవాఁడనిండ్లుపొందికగఁగట్ట. 118

వ. అనవుడు నతండు. 119

క. అపురూపమైనయోలగ
మిపు డొనరింపంగవలయు నీవని వేడ్కం
గపురంపువిడియం బిడి
యపుడంపిన సంతసించి యాతఁడు వేగన్. 120

చ. బలుపగడంపుఁ గంబములు బంగరుదూలములందమైన చ
ల్వల దొరతాయరంగులును బచ్చల యచ్చపుఁ దోరణంబులున్
వలుద సుపాణి ముత్తియపు వన్నెల సోరణగండ్లు మంచి కెం
పుల నెలకట్టులుం గలిగి పొల్పగునట్టుగఁజేసెఁ గొల్వుగాన్. 121

క. మఱియుం గేళాకూళులుఁ
దఱుచగు క్రొవ్విరులఁ బండ్లఁదగు పూఁదోఁటల్
వఱలెడు డిగ్గియలుం బలు
దెఱఁగులుగల యాటపట్లు తేటగనొప్పన్. 122

ఆ. అట్లు కొలువుగట్టి యాజముపట్టికి
నొసఁగనేల వేల్పు లొక్కమొగిని
దీవెనలనొసంగ దేవేరితోఁగూడి
కొలువుసొచ్చి జమునికొమరుఁడుండ. 123

ఉ. హత్తులఁగ త్తలానులను నందపురోవిరిఁబోండ్ల జాళువా
మొత్తముదెచ్చియిచ్చి సతమున్మదిమెచ్చుచుఁ గొల్చుచుండు దూర్
క్రొత్తగ నాల్గుసంద్రములకున్ నడుమంగల రాచసింగముల్
మొత్తములై యలంగొలువులోపల నొప్పెడు నేలదాలుపున్. 124

వ. అట్లుండ నొక్కనాఁడు. 125

శా. ఏలా వేఁడివెలుంగు నేలకును నిట్లేతెంచుచున్నాఁడు నేఁ
డో లేఁబాయపు బిడ్డలారకనుఁడం చొక్కొక్కచో మానుసుల్
గేలుందోయి తెమల్చిగుంపులయి యోలింజూడరా నింగియుం
గ్రాలన్నారదుఁ డేగుదెంచెఁ గడువేడ్కం గవ్వడింజూడఁగన్. 126

తే. వచ్చి రాచపాడినిగూర్చి పలుకులాడి,
చనఁగ సమకట్టియున్నచో జమునిపట్టి
కొలువునకుఁ దోడుకొనిపోయి కూర్మిఁజూప!
నారివేరంపుఁ దపసియునవియె నిట్లు. 127

క. వినుమిట్టిది మున్నెన్నఁడుఁ
గనుగొనలేదెందు నీజగమ్మున నెపుడున్
వినియు నెఱుఁగ మానుసులం
దును నిది యప్పురూపమనుచుఁ దోఁచెడునాకున్. 128

ఆ. అనుచుఁజాల దానియందంబు గొనియాడి,
పుడమిఱేఁడ్ల నెల్లఁ బోరగెల్చి
కూర్చుసొమ్మునన యొనర్చెదుజన్నంబు,
వడిగనీవు చేయవలయునంచు. 129

క. పాండుఁడు నీతోఁ జెప్పఁగ,
నిండుమది న న్నన్నఁ బుచ్చి నీకడకనుచుం
దండిగఁ జెప్పి యొసఁ బఱచి,
యొండుకడకుఁ బోయెఁ దనసియొయ్యననింగిన్. 130

క. అంతయుధిష్ఠిరుఁడప్పుడె,
మంతనమున, గృష్ణుతోడ మాటాడి వెసం
జెంతను నర్జును భీముని,
నంతసమునఁ బిల్చి యిపుడచని వెన్నునితోన్. 131

క. ఆలమున జరాసంధునిఁ,
గూలిచి రండనుచుఁ బనుపఁగొల్చనఁ జని యా
ప్రోలికి వాసన్నొరొక్కటి,
యోలింబరిమార్చె భీముఁడొక్కఁడుఁ గడిమిన్. 132

తే. అట్లుకలన జరాసంధునవురఁ గ్రుంచి,
యతనికొడుకైన సహదేవునకు దొరత
నమ్మఁబూనిచి ముగ్గురు నెమ్మివచ్చి,
గొంతికొలిపట్టికిని జెప్పిరంతనట్టు. 133

క. నలువురుతమ్ములు నడిఁ జని,
నలుగడలుం గెల్చి మేలినగలును గుఱ్ఱా
ములు నేనుంగులు రొక్కము,
వలువలునుం దెచ్చి యొసఁగ వలనుగ తేఁడున్. 134

ఉ. జన్న మొనర్చి వెన్నునకుఁ జక్కఁగఁ దమ్ముల మియ్యఁ బోనఁగాఁ
గన్నుల నిప్పులొల్కఁ గని కాఱులు ప్రేలుచు నెల్లవారలుం
బన్నమునొందఁ గృష్ణు శిశుపాలుఁడు తిట్టినసల్గియప్పుడే
వెన్నుఁడు చుట్టుకైదువున ద్రెవ్వడి ద్రుంచెనుఁ వానితుత్తుకన్. 135

క. అంతయుఁ గని దుర్యోధనుఁ,
డెంతయు మది వనటనొంది యీసునవారిన్
వంతలఁదగిలిచి సిరిఁగొన,
మంతనమున మామతోడ మఱిమఱిచెప్పెన్. 136

క. అతఁడునుసల్లునిఁ గొనిచని,
ధృతరాష్ట్రుని కెఱుకపఱిచితిన్నఁ గదొరయా
నతిఁగొని జూదంబునకున్,
గొతుకకపిలిపించె నటకు గొంతికొమాళ్ళన్. 137

తే. పిలుచుకొనివచ్చినట్టియావిదురువలన,
నంతయునెఱింగియునుభీమునన్నకడఁగి
శకునితో నాడిపుడమినిసరకుగములఁ,
దమ్ములనుదన్నువరుసగాఁదవిలియొడ్డి. 138

తే. ఓడిపిమ్మట ద్రోవదినొడ్డియోటు,
వడెయుధిష్ఠిరుఁ డప్పుడు వగపుతోడఁ
బ్రాతిగామిని ధృతరాష్ట్రుపట్టిపంచి,
కొలువునకుఁగృష్ణ రప్పించెఁగూళగాన. 139

సీ. అపుడు దుశ్శాసనుఁడాయింతిఁ గొల్వులో
దలపట్టియీడిచి తులువయగుచు
నన్నపంపునఁ గట్టుకొన్నబట్టయు విప్పఁ
గని భీముఁడెంతయుఁగనలువొడమి
చివ్వానతనిపొట్టఁ జీలిచినెత్తురు
త్రావెదనంచును బ్రతినవట్టి
తొడమీఁదఁ గూర్చుండఁ దొయ్యలిఁ జేసన్నఁ
బిలిచిన గాంధారిపెద్దకొడుకుఁ

వెనఁకవను రోఁకటను దొడల్ విఱుఁగఁగొట్టి
యెడమకాలను దలఁదన్ని యెలమిఁ గాంతు
ననుచుఁ బెనుబాసచేసిన నంతయు విని
ద్రోవదినిబిల్చి ధృతరాష్ట్రుఁడీవి నెఱపి. 140

క. దొరతనమెల్లను మరలం,
గరమక్కటికముననిచ్చి కలుపుకొని యుధి
ష్ఠిరు నంచినఁ దనవీటికి,
నరిగెందమ్ములను నాలి నాతఁడు గొనుచున్. 141

క. అదిగని సుయోధనుఁడపు,
డెదలోనంగుంది మామ నేకతమునకుం
గదియించి కొన్నినాళ్ళకు,
నవనారసిచెప్పి తండ్రి యానతిఁగొనుచున్. 142

ఆ. ప్రాతిగామినంచి పాండుకొమాళ్ళను,
నటకు మరలవచ్చునట్లుచేసి
కత్త్రిపెద్దయన్నఁ గడువడిఁ బురికొల్పి,
నెత్తమాడునట్లు మెత్తపఱిచి. 143

సీ. జూదాన నోడినచో దొరతనమెల్ల
విడిచి పండ్రెండేఁడు లడవినుండి
యామీఁద నొక్కయేఁడమరంగ నెవరికిఁ
గానరాకుండంగఁ గడపవలయు
నీలోన నెవ్వరి కేనియుఁ గనిపింప
మరల నెప్పటియట్ల జరపవలయు
ననిచెప్పియొప్పించి యాడినశకుని యు
ధిష్ఠిరునోడించె దిట్టయగుచు

అంతనాతఁడు తమ్ములనతివఁగొనుచు,
నూరివారందఱును జేరి యొకటఁగుందఁ
జిన్నవోయిన మోములవన్నెదఱిఁగి,
కట్టుబట్టలతోడనే కానకేగె. 144
కొడుకులగఱియు సుభద్రయు
వెడలిరి ద్వారకకు నిచట వీరలతివతో
నడవులఁ గాయలుఁ గసురులుఁ
గుడుచుచుఁ గ్రుమ్మరుచునుండఁ గొంకకయొకనాఁ. 145
జెరువు నడ్డగించి తెగువనుబోనీక,
బకుని తమ్ముఁడైన బల్లిదుండు
కినుక మీఱవచ్చి కిమ్మీరుఁడనువాఁడు,
నిక్క వానిభీముఁడుక్కడంచె. 146
అంత నా పాండునికొమాళ్ళు. 147
కడుఁ దపసులు చెప్పుకతలనాలించుచుఁ
గామ్యకంబనియెడి కాననుండఁ
గృష్ణుఁడేతెంచి యేగినవెన్క వ్యాసుని
పంపునఁగవ్వడి పట్టుతోడ
నింద్రకీలంబన నెసఁగెడి మలనుండి
యెఱుకురూపునఁ బంది నేసినట్టి
ముక్కంటితోఁ బోరి మిక్కిలి మెప్పించి
పాశుపతంబనఁ బరఁగునమ్ము
గట్టువిల్తునిచేఁ బొంది క్రాలుచుండ
వేల్పుదొరవచ్చి విప్పచ్చు వెంటఁగొనుచుఁ
దనదు వీటికిఁ జనియుండుఁ దనివిదీఱఁ
గొడుకుతోఁ గొన్ని యేఁడులు కూడియుండి. 148

క. పౌలోమకాలకేయులఁ,
బోలనివాతకవచులను బోలదిండ్లననిన్
వాలమ్ములఁ జంపించెను,
వేలకొలఁది మండగీల విప్పుచ్చుఁ జేన్. 149

వ. ఆలోన నొక్కనాఁడు. 150

తే. ఊర్వసి యనంగ నచ్చరయొర్రుక్రీడి,
చక్కఁదనమును గన్గొనిచాలవలచి
కూడ వేఁడుమ నతఁడొప్పుకొనక కసరఁ,
జేడిగానుండఁ దిట్టెనాక్రీడినాపె. 151

వ. అంతనిచ్చట. 152

ఉత్సాహ. కడమ పాండుకొమరు లచటఁ గదలి దైతమునెడిగా
అడవిఁజేరి కొన్నినాళ్లు లందునుండి పిమ్మటన్
వెడలిగంధమాదనంబు పేరఁ బరఁగుకొండకున్
నడచియందు నెమ్మినుండి నాతి కృష్ణపంపునన్. 153

వ. భీముండు చని. 154

క. జక్కులరక్కసులందల,
లొక్కుమ్మడి డొల్లనేసియుగ్మలి మదికి
న్నక్కువ గలిగిన పూవుల,
నక్కఱకోఁ దెచ్చియిచ్చె నక్కజమొదవన్. 155

తరువోజ. పాఱుని వేసంబు బాగుగాఁదాల్చి పాండునికొమరుల పజ్జనుండి
వీడ్కోఁడితనమున వెలయుజటుఁడను పేరిటిపొలదిండి భీముండువేడ్క
మీఱఁగ వేఁటతమినిఁబోయియుండ మెల్లననందఱ మీఁదకెసుకొని
పాఱినవడముడి పఱతెంచివానిఁ బరిమార్చియందఱి బన్నము వాపె.

సీ. అంతటవివినుండి యర్జునుండరుదెంచి
యన్నకునంతయు విన్నవించి

సుకముగానుండంగ నొకనాఁడు ద్రోవది
పూలుగావలెనంచుఁ జాలవేఁడ
మరల భీముఁడుపోయి మణిమంతుఁ గడతేర్చి
యలరులఁ గొనివచ్చియతివకిచ్చె
నామీఁద నొక్కనాఁడడవిని దిరుగుచు
వడముడి యొక్కచోఁబాముగాఁగ
దారిఁబడియున్న నహుషునినోరఁజిక్కి,
వెడలలేకున్నఁబాండునిపెద్దకొడుకు
పాముకడకేగి యడిగినవానికెల్ల,
బదులుచెప్పఁగనది భీమువదలిపెట్టె. 157

సీ. అట్లుండఁ జూపోపకచట దుర్యోధనుఁ
డేకతంబునఁ గర్ణుఁడెచ్చరింప
మామ యౌనని పలుమాఱును బలుకంగఁ
బసులఁ గాపాడు నెపంబువెట్టి
మొనలదంబముతోడఁ జనుదెంచి పాండుని
కొడుకులుదిగియున్న నెళవునకును
బజ్జగుడారంబు పన్నించి వారిని
వెక్కిరింపఁగ విఱ్ఱవీఁగుచుండఁ
జిత్రసేనుఁడనెడి జేజేలదిట్టఁడు,
వచ్చితాఁకి కర్ణుఁబాఱఁద్రోలి
దొరనుబట్టి త్రాళ్ళతోఁగట్టికొనిపోవఁ,
జెదరి వెఱచిపఱచి సిగ్గుదోఁప. 158

వ. అతనిమూఁకలు. 159

ఉ. పోలియుధిష్ఠిరు న్మఱువుపొచ్చినఁ దమ్ములఁ బంపవారునుం
జాలమునేయకేగి నిముసంబునఁ గూడఁగ ముట్టి పూవులం

గూలఁగనేయ మూఁకలనుగోయని యాఁటిచినిల్వ కేక యా
వేలుపుఁబోఁడ నింగికిని వేచనఁ జూచుచుఁ గ్రీడిప్రోడయై. 160

క. అమ్ములఁగూఁడ దొనరించియు,
నెమ్ములుపడఁ జిత్రసేను నేసిన నెఱచే
నిమ్ముల దుర్యోధనుఁడై,
శమ్మునఁ గవ్వడికినిచ్చి లలిఁబఁవినియెన్. 161

ఆ. కట్లుత్రోఁడనపుడు గాంధారిపట్టిని,
గాడ్పుపట్టి యన్నకడకుఁ దేఁగఁ
గనికరమున మేని కట్లెల్లవిప్పించి,
వడిగహితవుచెప్పి విడిచిపుచ్చె. 162

ఆ. ధౌమ్యునింట నునిచి తగనన్నదమ్ములు,
పాట్లుదేరనడవి పట్లకరుగఁ
గ్రొత్తపెండ్లిచేసికొనుచు నాదారిని
సైంధవుండు చనుచు సరగఁబ్రోల. 163

చ. నిలుకడఁగన్న క్రొమ్మెఱుఁగు నీటున మేనునుదాల్చి యిచ్చమై
మెలఁగెడు గుజ్జుమావివలె మేలిమిచేఁతలుపూని మెత్తనై
చెలఁగు పసిండి బొమ్మవలెఁ జేరువఁబ్రువ్వులుదున్న క్రోఁపదిం
గలయఁగఁజూచి ప్రూవిలుతుకమ్మనిములుకులనొచ్చి క్రచ్చఱన్. 164

క. కదియంజని మిక్కిలి ద్రో,
వది బతిమాలియును దెన్నువడయక బలిమిం
దుద కాయింతిని దేరను
బదిలముగాఁ బెట్టుకొంచుఁ బఱచెంగానన్. 165

తే. ధౌమ్యుఁడఱచుచు వెంటను దవిలివానిఁ
దిట్టుచును బోవనంతలోదిట్టయగుచు

నందెడామ్రగంధి యనఁగను నకులుండు
గుఱ్ఱాలఁ బరికింపఁ గొలువు కుదిరె
నాలఁగానఁ దంత్రీపాలుఁడనెడుపేర
నక్కడనె సహదేవుఁడు నమరియుండె
మాలినియనంగ ద్రోవదిపూలుముడువ
నొడయనివెలందుక సుధేష్ణ యొద్దనుండె. 170

ఆ. జెట్టిపట్లుపట్టి సింగంబుతో నైనఁ
బులులతోడనైనఁ బోరి గెలిచి
దొరకు నతనియనుఁగుఁ దొయ్యలులకు వేడ్క
సలుపుచుండు నొకఁడు వలలుఁడెపుడు. 171

సీ. అట్లు కొన్నాళ్లేగ నప్పుసుధేష్ణను
గన సింహబలుఁడట కొనరవచ్చి
మాలినిఁ దిలకించి మదినామె సొగసెంచి
మాటికెదఁదలంచి మరులుమించి
యక్కకునెఱిఁగించి యిక్కకుఁ జనుదెంచి
పాన్పున మేనుంచి వనరుచుండ
మాలిచేఁ దమ్మునికిఁ గల్లును
రాణిగారంపిన రమణిఁగొనుచుఁ
గృష్ణయేగిననాతఁడు కెరలిపడుచుఁ
దన్నుఁ బట్టంగ వచ్చినఁ దలిరుఁబోఁడి
కొలువుకూటంబు దెసఁబాఱఁగూడవచ్చి
సింహబలుఁ డింతికొప్పను జేతఁబట్టె. 172

క. ఈడిచి యొకరక్కసుచే
నీడిగిలం ద్రోయఁబడుచు నింటికిఁ జనియెం

జేడియచే నంతయు రెయి
వాఁడిమగఁడు భీముఁడెత్తిఁగి పాయనికినుకన్. 173

మత్తకోకిల. ఆఁడురూపును దాల్చి ద్రోవదియట్ల చీఁకటిఁగన్నియల్
గూడి యాటలు నేర్పు గీమునఁగోరి యూరయుచుండఁగా
నాఁడు సింహాబలుండువచ్చి, తనంతగేలిని జాఁప మా
టాడ కుక్కన వానిసం దునుమాడిచేసెను ముద్దగాన్.174

సీ. అట్లుముద్దగఁజేసి యట వైచిపోయిన
దమ్ములు నూర్వురుఁ దరలివచ్చి
చచ్చినయన్నకై చాల సేపేడిచి
పీనుంగుపైఁ గృష్ణఁబెట్టికట్టి
కొనిపోవుచుండగఁ గూయుకెమాలిని
బానసంబున గాష్పుపట్టి వినఁగ
వారును గాటికి వచ్చెడునంతకు
వడముడి యటకేగి బడలువడఁగ
నందఱనుద్రుంచి ద్రోవదినల్లఁబంచి
మాఱుత్రోవనువంటిల్లు మరలఁజొచ్చె
నీటికేతెంచుమాలిని వెలయఁజూచి
ప్రోలివారెల్ల వెఱచిరి బూతమనుచు. 175

ఉ. అంతయునాలకించి యట నాధృతరాష్ట్రినిపట్టి యిచ్చటం
గొంతికొమాళ్ళు పిల్తురని కొంతతలంచి సుశర్మనంచి యీ
వంతయు జాగుసేయ కట నావులఁబట్టఁగఁబంచి తానునున్
మంతురులాలమంచెదిరి మార్కొనఁగల్గినవార్యిన్వో వడిన్. 176

క. మఱునాఁడు వెడలి విరటుని,
పఱగడ మొదవులను బట్టవడచక్కికిఁగ్ర

చ్చుఱఁ బఱితెంచెను గొల్లలు,
వెఱపెల్లునఁబఱచి విరటువీడు సొరంగన్ 177

క. అంతకుమున్న సుశర్ముఁడు,
పంతము లాడుచునువచ్చి పలకడఁబసులన్
వింతగఁబట్టిన విరటుఁడు,
చెంతలనున్నట్టి తనదు చేరువత్తోడన్. 178

క. చనితాఁకి యోడిపోయిన,
నెనరేది సుశర్మయపుడు నెఱమగఁటిమినా
తనిఁ దనతేరికిఁగట్టిన,
వనట న్విడిపించె రేయి వడముడి యతనిన్. 179

సీ. విరటుండు నెయ్యురు వీటనులేనప్పు
డిచట దుర్యోధనుఁ డేగుదెంచి
పసులఁ బట్టెనటంచుఁ బసులవారలు చెప్ప
విని పిన్న గావున విరటుకొమరుఁ
డు త్తరుండింటను నువిదలముందఱ
బీరముల్ వల్కుచు వెడలికృష్ణ
పంపునఁబేడి వార్వములఁ దోలఁగొనుచు
వడివచ్చి ముంగలఁ బగఱఁజూచి
వెఱచి దిగులొంది యరదంబు వెనుకవంక,
త్రిప్పుమన్ననుగవ్వడిత్రిప్పకున్న
బెగ్గలంబునఁ దేరని డిగ్గనుఱికి,
పాఱఁజొచ్చినఁగ్రీడియుఁ బఱుగువాఱి. 180

తే. అతనిఁ గొనివచ్చి యరదంబు నందుఁ బెట్టి
తాను గ్రీడియౌటెఱిఁగించి తాల్మిఁగొలిసి

యతని వరదంబు వడపంగ నానతిచ్చి
యమ్ముల(ను) వింట బెట్టిన జమ్మికడకు 181

క. చని వలసినవాని గై,
కొని తక్కటివాని నందె గుట్టుగనిడి చ
య్యన( జని గాండీవంబును;
గొనయము నెక్కించి మించి గోరము గా(గన్. 182

క. ములుకులు వఱపిన మూ(కలు,
నలు దెసలం బాయ విచ్చి ననసు బఱవన్
బలువానను లోగి( దా(కిరి,
చిలుకల వానలు గురియుచు( జేవయెలర్పన్. 183

క. తఱి( దాట కుండ(గ వ్వడి,
మొఱ(గించుకొనియెను దన్ను నిచ్చట ననికిం
దఱి పలికిన( దఱిక సుట,
మొఱగించెను భీష్ము( దప్ప డెల్లరు నిన(గన్. 184

వ. అంత నర్జునుండు. 185

తే. పసుల మరలించి కావలి పరినిద్రుంచి,
వెనుక( జనుచున్న జేనిని వెంబడించి
కదిసి యోడించి పెఱవారి( గండడంచి,
పొలికలన నేత్రము లుబ్బులు వెలు వరించి. 186

సీ. తమ్ముని తల ద్రుంచి తత్తడులను నొంచి
బలియుని( గర్ణుని( బరవ( జేసె
ద్రోణుని నొప్పించి ద్రోణకుమారుని(
జేయూడకుండంగ( జిక్కువఱిచె(
గృపుని నమ్ములముంచి కినుక మై భీష్ముని
యరదంబుపై సోలి యొఱగ( జేసె

దారను గేరడమాడి దురమున దడములఁ
బీనుఁగు పెంటలుగానొనర్చి
మఱియునందఱ సోలించి మఱచిపోక,
తెచ్చెనుత్తరఁబొమ్మపొత్తికలకొఱకుఁ
బేరుగలవారి తలచీర లారఁగొని,
తనివిదీఱంగ ననిచేసి వెనుకమరలె. 187

సీ. అంతఁ దెలిసి యుస్సురనుచు దుర్యోధనుఁ,
డపుడెభీష్మపలుకులాలకించి
సిగ్గుఁబాటుతోడఁ జేరువతోఁగూడి,
యింటికడకు నడచె నెఱుకగలిగి. 188

క. అప్పుడు కవ్వడి జమ్మిని,
నెప్పటివలె విల్లునమ్ము లిడి యుత్తరున్
మెప్పుగఁ దేరను నిడి తా,
నొప్పుగ నొగలెక్కి చనియె నూరికి నెలమిన్. 189

క. ఈలోన నట యుధిష్టిరుఁ,
డాలములో గెలుపుగొన్న యల విరటునితోఁ
బోలఁగ జూదం బాడుచు,
నాలములోఁ బేడిగెలిచె నని ప్రేటుపడెన్. 190

క. అమ్మఱునాఁ డందఱు నొక,
యిమ్మునఁ దగఁగూడి తొంటి యేపుననుండన్
నెమ్మిని విరటున కుత్తరుఁ,
డిమ్ముల నెఱిఁగించె వారి నెల్లను వరుసన్. 191

క. ఎఱిఁగింప యుధిష్ఠిరునకు,
నెఱిఁగి విరాటుండు లేచి యెల్లఁ దప్పుల్

మఱవంగ వేఁడుకొనియెం,
దెఱఁగుపడం బలికి కూర్మి తెల్లము గాఁగన్. 192

తే. చుట్టముల నెల్ల రావించి జోటిమిన్న,
నుత్తరయనెడి తనకూఁతునొసఁగి పెండ్లి
చేసె నభిమన్యునకు వేడ్కఁ జెన్నుమీఱ,
నెంతయును జూచువారలు సంతసిల్ల. 193

వ. అనిన విని తరువాతి కత నెఱిఁగింపు మనుటయు. 194

క. కలువలవిందును బ్రొద్దును,
మలల న్సంద్రముల నేళ్ళ మఱి యీపుడమిన్
వెలుఁగును జీఁకటిఁ జుక్కల,
నెలమినిఁ గలిగించి ప్రోచి యేలెడి సామీ. 195

మాలిని. జగముల మొకిమీఁడా సాదులం బ్రోచుజేఁడా
పగ యెఱుఁగనివాఁడా పల్వలం ద్రుంచు ప్రోడా
వగ లొందవనివాఁడా వంతసంద్రంపుటోడా
నిగు లడఁచెడివాఁడా నేలకు న్సంగడీఁడా. 196

గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచననైషధ కావ్యరచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరివంశ పయఃపారావారరాకాకైరవమిత్రసుబ్రహ్మణ్యామాత్యపుత్రసకలసుజనవిధేయ వీరేశలింగనామధేయ ప్రణీతంబైన యచ్చతెనుఁగు భారతమునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము

క. మొదలుం దుదియు నెఱుంగక,
వదిలముగా నెప్పుడు నుండి పాసుగొనంబుల్
వెదకినను లేక మేలై,
పొదలించుచు జగము లేలుచుండెడి వేల్పా. 1

వ. శౌనకుండు లోనుగాఁగల జడదారిఱేండ్లకా సూతుం డిట్లనియె. 2

క. విరటుఁడు కృష్ణుఁడు మొదలగు,
దొరలెల్లను గూడి యుండి దుర్యోధను తుం
టరితనము నగ్గడించుచు,
నరుదుగ నొకరాయబారి నచటికిఁ బంపన్. 3

తే. అందఱును నెంచి యచ్చోటి కరిగి యతఁడు
తెలుపవలసినపలుకులఁ దెలియఁ గఱపి
ద్రుపదు నొజ్జను బంపిరి దొడరి పగను
పుడమి జముపట్టికిని యియ్య నడుగుకొఱకు. 4

తే. అంత నిటఁ గ్రీడి వెన్నునియింటికరిగి
పోరఁ దనతేరునడపంగఁ గోరుకొనియె
నాఁడె దుర్యోధనుఁడువచ్చి నాఁడెమైన
బంట్లఁ బదివేవురను దానుఁ బడసిచనియె. 5

క. నేలఁ గలదొరలలోపలఁ
జాలఁగ దుర్యోధనునకు సాయము చూపం
బాలుపడిరి పెఱవారలు
పోలఁగ జముపట్టిఁ జేరి పొలిచిరి కడిమిన్. 6

చ. ద్రుపదునియొజ్జ యేగియటఁ ద్రోవకురా ధృతరాష్ట్రుతోడఁ గొం
త పొసఁగ మాటలాడి తనదారిని వచ్చిన గ్రుడ్డిఱేఁడును

న్నపము తోలంగఁ బంపెఁ దననేరమి గన్పడ నూరిపోసి నీ
విపుడ యుధిష్ఠిరుం గదిసి యీయనిమానుపు మంచుసంజయున్. 7

సీ. ఆతండు చనుదెంచి యందఱకును మ్రొక్కి
కొల్వులోపలనున్న గొంతికొడుకుఁ
గదిసియందఱు వినఁ గరముఁదీపులుగాఁగఁ
బెనఁకువ మానఁగఁ బెక్కువగలఁ
దేనిమాటలఁ దెల్పి తిన్నని తెన్నున
నడవంగ జముపట్టెఁ దడవు వేఁడి
చదురెల్ల గాన్పించి చక్కని బదులుమా
టలఁ బాండుకొమరుని వలనఁబడసి
వారి వీడ్కొని ధృతరాష్ట్రు పజ్జకేగి,
యెల్లచందమ్ములాతని కెఱుకపఱిచి
యలుకపుట్టించితగవు మైఁబలుకవలయు,
నుడువులెల్లనుదిటముగానుడివిచనియె 8

సీ. అంత యుధిష్ఠిరుఁ డరసి యిచ్చటనుండి
వెన్నని ధృతరాష్ట్రు వీటికంప
నాతని రావించి యనియె నిక్కైవడి
నీవేగి సగపాలు నేలలోన
మాకియ్య జేనిత్రో మఱిమఱి చెప్పుము
వినఁడేని యామీఁద వినుము తెలియ
నేవురకును మాకు నేను ప్రోళ్ళైదను
గడ కిచ్చునట్లుగఁ గడఁకఁ బలుకు
మట్లు చేసిననైనఁ బోరనెడుమాటఁ
దక్కి కూడి బ్రదుకుదుము తఱుచు లేల

యనిన పిమ్మట భీముండు నతనితమ్ము
లవల ద్రౌపది మదిఁ జెప్పి రతనితోడ. 9

ఉ. ఆవలఁ గృష్ణుఁ డేగి మరియాదమెయిన్ ధృతరాష్ట్రుఁ జూచి యా
క్రేవల ద్రోణునిం గృపునిఁ గేల్గవమోడిచి పల్కరించి య
త్తావున నున్న భీష్మునిని దద్దయుఁ గూరిమి గారవించి యు
చ్చో నెరవారఁ గొల్వునను జూపఱ డెందములుం గరంగఁగన్. 10

చ. చనువును బల్మిఁ జూపి పలుచందములం దగఁ జెప్పి యాతఁడో
దనియక యొద్దనున్న జడదారులచేతను జేతనైన లా
గునఁ బలికించి యెందునను గోరిక చేకుఱకున్న నోలగం
బున ధృతరాష్ట్రపట్టిపయిఁ బూనినకిన్కను బల్కు లాడినన్. 11

క. వడిఁ గర్ణుని దుశ్శాసను
చెడుగఱపులు నమ్మి కృష్ణుఁ జెప్పడఁ గట్టం
గడఁగిన దుర్యోధనుఁ డెద
జడియఁగఁ దనరూపు చూపి చనెఁ గృష్ణుండున్. 12

ఆ. అట్లు కొలువు విడుచునప్పుడు వెన్నుండు
బవరమరుగుదెంచెఁ బదిలమనుచుఁ
బలికి వచ్చి కుంతి బసకేగి మాటాడి
విదురు నింటఁ గుడిచి వెడలెవీడు. 13

వ. అట్లు బయల్వెడలి కొన్నినాళ్లకు. 14

చ. విరటుని యూరుచేరి యట వేపురముందర గొంతిపట్టికిన్
సరగున నంతయుం దెలిపి జాగొనరింపక గొప్పదండుతో
దురమున కాయితం బగుట తొల్లటి కర్జముగాఁగఁ జెప్పి యు
బ్బరముగ వాఁడిసూదిమొన మోపినయంతయు నేలనీయఁగన్. 15

క. ధృతరాష్ట్రుని కొడు కొప్పమి
కతలుగ నెఱిఁగించి మిగులఁ గయ్యంబునకున్

హితవుగఁ బురికొల్పినఁ దగ
నతఁ డప్పుడె ప్రమదముపట్టి నందఱుఁ జూడన్. 16

క. పడవాలుగాఁగ నొసరిచి
వెడలి కురుక్షేత్రమనెడి పేరిటి చోటన్
విడియించి మూఁక నెల్లను
గడు సంతోసమున నుండెఁ గల నొసరింప. 17

సీ. వెన్నుండు నడచిన వెంటనె యచ్చట
దుర్యోధనుండును దోడు సూప
వచ్చినజేఁడుల హెచ్చరికను జేసి
గమికి నెల్లను మొనగానిఁ గాఁగ
భీష్ముని నొసరించి ప్రేరేఁచి మొనలును
దమ్ములు నెయ్యురుఁ దవిలి రాఁగఁ
గదలి కురుక్షేత్ర మదనుతప్పక చేరి
విడియించె దడముల వేఱుచోటఁ
గర్ణుఁ డంతకుమున్నె పెక్కండ్రు వినఁగ,
భీష్ముఁడుసుఱులువిడిచినపిదపఁగాని
తాను బోరికి రానని తగని బాస,
చేసికొనె మాటపట్టింపు చేత వీట. 18

క. దళవాయి యైనభీష్ముఁడు,
కలసికిఁ బురికొల్పి మొనలఁ గడుబీరమునన్
దలపడఁ బంచెను జోదుల,
కెలమియుమగఁటిమి చలంబు నెసకంబెసఁగన్. 19

ఉ. అయ్యెడఁ బాండుపెద్దకొడు కందఱు నం దరుదండఁ గాల్నడన్
జయ్యన భీష్ముపాలికిఁ గనం జని వేలుపుఁ జేటిపట్టిచే

గయ్యముసేయ నానతిని గైకొని దీవెన లంది ద్రోణుని
నెయ్యపు మామశల్యుఁ గృపుఁ గని వీడ్కొనివచ్చెఁ గ్రమ్మఱన్.

క. చిందమ్ములప్రోఁతలు మి,
న్నంది మొసఁగ భీష్మదండు లాలపువేక్కం
గ్రందుగ నడచెను బయిషయి,
ముందఱఁబాండునకొమాళ్ళమూఁకలమీఁదన్. 21

సీ. నాగతెక్కి కృష్ణుండు తగుమాడ్కి నిగుడంగఁ
దెల్లనివార్వముల్ తేజరిల్ల
జేజే లొసంగిన చిందంబు నొత్తుచు
నరదంబుపైఁ గ్రీడి యరుగుదెంచి
యిరువాఁగుఁజూచి తానెంతయు మదిలోన
నక్కటికము పుట్టియయినవారి
వేయఁజేతులురాక విల్లునునమ్ములుఁ
దేరనుబడవైచి దిగులుత్తోఁషఁ
గూలఁబడినఁజూచి గొబ్బునవెన్నుండు,
పాడిఁగఱపి పోరఁబగఱనొంచి
గెలువుఁగొంట యేలికలకెల్లఁ దగవని,
మదికినాటఁజెప్పి మఱఁదినపుడు. 22

క. దురమునకుంబురికొల్పినఁ,
బరువడి సందియము వాసివాసి మొసంగం
గురిసెను నమ్ములవానల,
గరువంబఱి పగఱపౌఁజు గలఁగంబడఁగన్. 23

సీ. మూర్తుర మొత్తముల్ మార్కొనిపోరిన
నందడికయ్యంబు జరగెనపుడు.

ద్రోవదికొడుకులు తోడుగ నభిమన్యుఁ
డదరి యొప్పనివారి కడఁకఁ జెఱిచెఁ
గృపుఁడు నశ్వత్థామ కేడించి మూఁకల
పైఁబడి తనలావు బయలుపఱిచి
రుత్తరుండేగి శల్యునిమీఁదఁ బోటొగ్గి
యాపటై నాతనితూపుగముల
నంతభీష్ముండుగవిసివాలంపగములఁ,
దెలుచఁబరఁగించిమూఁకల బెగడుపఱిచి
యెల్లెడలఁ దానయైపొల్చి యేపుచూప,
విరిగిసురిఁగిరిపగవారిబిరుదుమగలు. 24

క. ఆలోనఁ బ్రొద్దుగ్రుంకిన,
నాలముసాలించి నాఁటి కందఱు వీళ్ళన్
జాలముసేయక చేరిరి,
చాలఁగ విన్నెటికొడుకు సారెఁ బొగడుచున్. 25

ఉ. రెండవఁనాటిపోరునను రెండవ ప్రొద్దుకొమారు పోలికన్
దండిమగండు క్రీడి తన త్రాణనుజూపెఁ గరంబుఁ బుచ్చి భీ
ముండును భానుమంతు జముప్రోలికి ద్రోవదితోడఁబుట్టువుం
గండునఁదాఁకి ద్రోణుఁడును గ్రచ్చుఱఁ బాఱఁగఁజేసె నీసునన్. 26

సీ. మూఁడవనాఁడును మొగ్గరంబులుపన్ని
యిరువాఁగు నొండొంటిబెరసితాఁక
దుర్యోధనుఁడు భీమునితోఁ దలపడిపోరి
మే నెఱుంగక తేరిమీఁద సోలె
మూడుజాములయప్డు డీడఁబోవక భీష్ముఁ
డుక్కునఁ బెక్కురఁజక్కడంచి

యెక్కడఁ జూచిన నెమ్ములదిమ్ములుఁ
గండలకొండలు నిండియుండ
నెత్రుటేరులు పఱపింప నిలువ లేక,
బెండువడి క్రీడిఁ జుణిఁగిన వెన్నుఁ డడరి
చుట్టువాలును జేఁబూని దిట్టయగుచు,
నరదమును డిగ్గి భీష్ముపై నరుగుచుండ. 27

క. కవ్వడియువచ్చి వెన్నుని,
నెవ్వడిఁ గౌఁగిటను బట్టి నిలిపి వెనుకకున్
దవ్వులఁ గొనిచని భీష్ముని,
గ్రొవ్వడఁగించెను గడంగి కూటువ చెదరన్. 28

క. నాలవనాఁటి పెనంకువ,
వాలుమగఁడు శల్యుకొడుకు పలుకయు వాలుం
గ్రాలఁగ ధృష్టద్యుమ్నుని,
పైలిఁగవిసి తెగటాఱెఁ బరి పడలువడన్. 29

పంచచామరము. ఘటోత్కచుండు జిత్తులెల్లఁ గానిపించి మూఁకపైఁ
దటాలునన్ మిఱుంగు లీను తళ్కుటంప గుంపులన్
దిటంబు మీఱ నేసి యేసి దిట్టలైన వారినిన్
హటాహుటిం గలంగి పాఱనూకె నుక్కడంగఁగన్.

ఉ. ఏనవనాఁటి కయ్యమున నెంతయు వాఁడిమి చూపె ద్రోణుఁడా
పూనికిఁ జూచి మాఱుకొని పోరెను భీముఁడు చేవ యేర్పడన్
మానక లక్ష్మణుండు నభిమన్యుఁడునుం జలమగ్గలింపఁగా
నేనుఁగు నేనుఁగుం బెనఁగు నేపునఁ బోరిరి చూపఱెన్నఁగన్. 31

క. అఱవనాఁడల వడముడి,
మాఱుకొని గుదియ విసరుచు మావంతులతో

సీఱుగఁగాఱులఁ గెడపెను,
బీఱువడుచు దాయులెల్ల బెదరంజెదరన్. ౩౨

క. అని ద్రోణుఁడు ధృష్టద్యు
మ్నునిఁ గనలునఁ దారసించి మొనలుతలంకన్
దనసింగిణి వాలమ్ముల,
ననువులు నాటంగనేయ నాతఁడుపఱచెన్. ౩౩

తే. ద్రుపదుకొమరుఁడు రారాజుదాఁడరితేరు,
నుగ్గుచేసిన వెన్నిచ్చె సిగ్గువిడిచి
చేకితానుఁడుఁ గృపుఁడును జేవమీఱఁ,
బోరి రేడవనాఁడాలపోతులట్లు. ౩౪

సీ. ననలెత్తువేడ్క సునాభుండు మొదలగు
గాంధారికొడుకులఁ గవిసిభీముఁ
డుద్దవిడినివారిఁ బెద్దనిద్దరఁబుచ్చి
యేనుంగులనుజేసెఁ బీనుఁగులను
మఱి యలంబసుఁడను మానిసిదిండియి
రావంతు మార్కొని లావుచూపి
పెద్దతడవునకుఁ బిద్దించె నాతనిఁ
గవ్వడియొంతయుఁ గస్తిచెంద
మఱిఘటోత్కచుండుమార్కొనిద్రోణుండు,
మొదలుగలుగువారిమురువడంచి
యలఁతిమూఁకనెల్ల నలుఁగులపాల్సేసె,
నవలినాఁడు వేల్పులబ్రపడఁగ. ౩౫

క. ఎనిమిదవనాఁటి రాతిరి,
చనువున దుర్యోధనుండు చనిభీష్మునితోఁ

దనగోడు మొఱ్ఱవెట్టినఁ,
గనఁబఱచెద నెల్లినాఁడు గండని నత్తఁడున్. 36

తే. తొమ్మిదవనాఁటి ప్రొద్దునఁ దొంగలించు,
సంతసంబులు మోములఁ జౌకళింపఁ
గదలియిరువాఁగునుం గాలికలనఁ బొలిచి,
రెత్తికోలునఁబడవాళ్ళు హెచ్చరింప. 37

సీ. అపుడు కోల్తలచేసి యభిమన్యుఁడడరిన
నరిగియలంబుసుఁడడ్డపడియె
వివ్వచ్చుఁడరుదెంచి పీఁకఁజూపినఁ బాఱు.
దొరలకు ద్రోణుండుతోడు చూపె
బాసటయగుచు దుశ్శాసనుఁడు శకుని
వెంటరా భీష్ముండు వేఁడి చూపి
వాఁడినారసములఁ గ్రీడిని నొప్పించి
వెన్నునినంపఱ వెగడుపఱిచి
రావుతులఁ గ్రుంచి పొలియించి మావతులను
నరదములవారి నొంచి కాల్వురనడంచి
కడిమిచూపిన దళములు గలఁగఁబాఱ
లేట మొగములుపడి రెల్ల మేటిమగలు. 38

క. చేయునదిలేక కవ్వడి,
యాయమ్ములనాఁటియున్న యమ్ములవెతతోఁ
బాయవడు మొనలఁ బిలుచుచు,
నోయునదూపులను నేయుచుండెను భీష్మున్. 39

శా. అచ్చొప్పంతయుఁ జూచి కృష్ణుఁడెదలో నారాటముం జెంది వి
వ్వచ్చుండెంతయు నొచ్చియుంట నొగలన్వార్వ్యంపుఁ బగ్గంబులన్

మెచ్చుల్గుల్కఁగఁ గట్టి తేరు డిగి యామిన్నేటిపట్టిం బొరిం
బుచ్చెంగా నడతెంచెఁ గేల బలితంపుఁ జుట్టువాలొప్పఁగన్. 40

క. త్రోడనెపఱతెంచి వడిం
గ్రీడియునిరుగేలఁ బట్టి కృష్ణుని మరలం
దోడుకొనిపోయి తేరున
వేడుకఁ గూర్చుండఁబెట్టి వేఁడుచుబలిమిన్. 41

క. తియ్యనిమాటల వెన్నని
నియ్యకొనంజేసి వెడలి యీరసమెసఁగం
గయ్యమునకు డాసినపుడె
యొయ్యనఁ బ్రొద్దత్తమిల్లె నుడిగెదురంబుల్. 42

తే. నాఁటిబవరంబుఁగని మదినాటుకొన్న
యుమ్మలమ్ముననింకఁ గయ్యమ్ముమాని
కానలకు నేగుదునటంచుఁగెడఁకఁబలుకు
నలయుధిష్ఠిరు నూఱార్చియనుపుమీఱి. 43

క. వెన్నుండారే యాతని
విన్నేటికొమారుడకకు వివ్వచ్చునిత్తోఁ
దిన్నఁగగొని చనియాయన
సన్నగ నడిగించెఁ జావుచందముఁ దెలుపన్. 44

ఉ. అందున కాతఁడిట్టనియె నాఁడుఁదనంబును దొల్తఁదాల్చి యా
పొందికఁబాసి వెన్కమగపోడిమిఁ దాలిచియున్న వారిపై
నెందును నేయకుందునని యోఁ బ్రతినందగఁ బట్టినాఁడ మీ
యందుశిఖండి యట్టిఁడగు టాతని ముందిడికొంచు నాపయిన్. 45

క. నేనేయనితఱిఁ గవ్వడి
నోనేసినఁ గూలువాఁడ నునుఁదూపులచేఁ
బూనియటుచేయుఁ డంచును
నానతియిడి పంచె మంతనంబున వారిన్. 46

